ద ॥ ౧ ॥ ఉల్లమురంజిల్లగొల్లభామల కెల్లఁజెల్లుగయాలలు సెలగిపాడుచును॥ ౨॥ అందెలుగజ్జెలు నందంద మ్రోయగ । పొందుగనడిచెను పురుషోత్తముఁడు ॥ ౩ ॥ నల్లని మేనుపు నలువొందు మేనితో । జెల్లుగపింఛము సిరమున మెరయఁగ ॥ ౪ ॥ ముల్లోకముల నేలు మురవైరియప్పుడు । పల్లవిజనముల వాడల వెడలెఁ ॥ ౫ ॥

సీ॥ అంతట శ్రీకృష్ణుడాపల్లె వెడలంగ సూర్యోదయంబయ్యె సొంపుమీర । కమలముల్ వికసించె ఘనచీకటులు మాసె చుక్కలు మాసెను చొక్కముగను । పక్షులు సెలరేగి బాగుగా గూసెను వృక్షముల్ వికసించె వేట్కమీర । మధుపానములు జేసి మత్తభృంగంబులు ఝంకారరవముల జాలప్రబలె॥

తే॥ గానరీతి వేటలు గలిగియుండ । బాలురను గూడి కృష్ణుండు ప్రౌఢిమీర । మెల్ల మెల్లన సఖులతో మేలమొదవ । మాధవుఁడు వచ్చె నప్పాదామడుగుదరికి॥

వ॥ అప్పుడు సూర్యోదయంబైన లక్షణంబెట్టులనెనుండెనే॥

త్రిపుట. అరుణభానుడు పూర్వదిక్కున నవమరియుండిన చందమప్పుడు । స్థిరముగా దేవతలు పట్టిన దీపమానగ ॥ ౧ ॥ తరుణభానుడు సూడనొప్పెను సురలు దేవేంద్రునకు పట్టిన । గురుతరంబుగ సూర్య పట్టపుగొడుగొయనగ ॥ ౨॥ పనిలున్నై కాళింగు నణచను బాలుడై హరి నొప్పగనితో । నుదయపర్వతమెన్నై సూర్యుండొప్పెసుదెనె ॥ ౩ ॥

వ॥ అప్పుడు శ్రీకృష్ణుండును బాలురును మడుగునగిరికి వచ్చియెట్టులనుండిరి

ఏకతాళము. పచ్చని గ్వారిము బలసియుండగ । విచ్చలవిడిగా విడచిరి పసులఁ ॥ ౧ ॥ బంతులు నాడుచు పంతములాడుచు । వింతలు సేయుచు వేల సిరియుచటఁ ॥ ౨ ॥ వృక్షము లెక్కుచు పిలపిల మరుకుచు । బక్షులరీతిని బరగిరి వేట్కఁ ॥ ౩ ॥ వృక్షములో బలు వృక్షము గనుగొని । యాతుణ మునసేయ బ్రాతుండు ॥౪॥ వ ॥ ఆసమయంబున శ్రీకృష్ణుం డెట్టులనుండెను॥

జంపె. పీతాంబరమును దుముబిగియించి కట్టుకొని । ఖ్యాతిగా దానశాఖ గ్రక్కున నెయ్యెక్కెఁ ॥ ౧ ॥ ఎక్కి అంతట చూచి చక్కముగ మాధవుండక్కజముగానుఁడుం గన్దరిపడ దుమికెనె ॥ ౨ ॥ దుమికినంతట జలము తొలగి పాతాళంబు । విపులముగ గనుపించె విఖ్యాతముగను ॥ ౩ ॥ శేషుండదిరెను భూమి సెగరి గడగడవణకె । భాషాపతికి మంత్రిపతనములు దప్పెఁ ॥ ౪ ॥ దిక్కులన్నియు జెదరెనేనలు దిక్కులు వదియె । గ్రక్కున భానుండుగతితప్పినడిచెఁ ॥ ౫॥ సా

పక్షీంద్ర నీవు రూరి బహుమాంసములను * మాసన్నిధికి తెచ్చి మనికితము
సేయ * భాసురంబుగ వలదు పలుమారు నీకు * అనుచు చెప్పగ వినక నాగ్రహం
బునను * చలము సేయుగ జూచి సౌభరిమునివరుండు * పక్షీంద్ర యీనదికిఁ బ్రబ
లి వచ్చితేని * పక్షములూడి గిట్ట బహుమానిశపించె * మునిశాపమందుకొని
మనమున వెఱచి * ఖగనాథుఁడే నెన్నడు నిల్వలేక * అనుచు నా యోగి
యంతయును దెలియ * దప్పక వినుపించె ధరణీశునకును * ఇది నీకు జెప్పితి యిక
మీఁద వినుము * ముదముతో వినుపింతు ముందరికథయు * అవనీశ నీకును హ
రి చరిత్రంబు * వివరించి తెలిపెద వినుమని పలికె * కాళింగుడప్పుడు గడుదీ
నవృత్తి * బాలకృష్ణుని పాదపద్మముల బడియు * మనమున హరి నిల్పి మఱి
యూఱకున్న * గనుగొని కృష్ణుండు కరుణతో బలికె.

వ || అయ్యెడ శ్రీకృష్ణుండు కాళింగునితో నేమనుచున్నాఁడు.

క || ముదమున నాపదములు దల | బదిలముగా వెలయుచుండ బక్షీం
ద్రుండున్ | గదియంగ వెరచుగనుగొని | కదలుము నీపురికి యనెను గమ
లాక్షుండున్ ||

వ || అప్పుడు శ్రీకృష్ణుండు మఱియు నేమని యానతిచ్చెన్ ||

జంపె || పుణ్యచరితంబిదియు పాపరహితంబిదియు | యిది దేవమంత్రమిదియు
పాపరంబులకు || ౧ || ఇలలోన భక్తితో నెవ్వరులు జదువుదురో | యనఘ వారల
బలిమి సంటకుము నీవు || ౨ || కాళింగ యీకథయు గరుణతో సెవ చేసి | యిలను
పొంఁడిన మఱియు నెలమి వ్రాసినను || ౩ || అనుదినము విన్న మఱి యధికులై వెల
యుదురు | హరిలోకమును వారలందియుండుదురు || ౪ || ఆయురారోగ్యంబుల
ష్టసంపదలకును న్యాయకనుండు నాపావనులయిండ్లన్ || ౫ || చాలసంతోషము
లు సౌఖ్యంబులును గలిగి | బాలురును గోవులును బాగుగా వెలయున్ || ౬ ||

అటతాళము. అనుచు ప్రీతిని యానతిచ్చిన హరిని గాంచి యప్పుడు వి
నుతి సేసిరి నాగకన్యలు విభునితోడన్ || ౧ || దేవ నీ మహిమంబు దెలియఁగ దివి
జులైనన్ | జాలరు | భావమున గనుగొనఁగఁ జాలఁడు పద్మజుండు || ౨ || మదిని
గోరెడు దీనకన్యల మైత్రిమిపుడు | మీరలు | సేమమున మా గృహమున
కు విచ్చేయుడనిరి || ౩ ||

వ || అనవుడు శ్రీకృష్ణుండు మహాసంతోషంబున గాళింగుని నగరంబున
కు వేంచేసెనటయెటువలెను.

ఏకతాళము. ఇంపుగ కృష్ణుని యింటికి తోడుక | నేపారగ జని రింతులు
వేడ్కన్ || ౧ || బంగరు పీఠము పైహరి నునిచిరి | సొంపుగ జేసిరి పూజలతి వేగా

౨ || శృంగారంబుగ సంగనామణులును | శృంగారించిరి చిన్నికృష్ణునికి ||*|| కుండలములు నిక కోటి తేజములగు | దండికిరీటము దగపు గనిడిరి || ౩ || బంగరు గజ్జెలు పైడందెలు మరి | రంగుగ మొలనూలంగుళికములు || ౪ || సందిట తాయెతులందము గల్గిన | సిస్తులమర్చిన కౌస్తుభమణియును || ౫ || పులిగోరు పతకములలికింకణములు | తళుకు మణులు మించు తాళిబిళ్లలును || ౬ || మంచిగశృంగారించిరి మగువలు | తేటము త్రైపుసరు లేపునకు పుష్పము || ౭ || కనకాంబరములు ఘనమణి సొమ్ములు | గనుగొని యిచ్చిరి కానుకగాను || ౮ ||

జంపె. అంత శ్రీకృష్ణునకు నావేళ భక్తితో * నేపైన మున్నింతో నెలమి వేడుకల * పన్నీరు గంధంబు బాగుగా నలదుచును * తిన్నగా కస్తూరి తిలకమిడి రపుడు * గంధ ముత్తముల చేఘనుని పూజించిరి * సుందరాంగులు దారు చూచి శ్రీహరిని * తమ దృష్టి తగులునని దాన వారికి వేగ * మగువలందరు గూడి మాటి మాటికిని * వింతగా హారతులు వేడుకల అగదెచ్చి * ముత్యాల హారతులు ముదముతో నిడిరి * అంగనలు శోభనములపుడు పాడుచు తెచ్చి * మంగళము పాడి రామాధవుని జేరి.

వ || ఆ సమయంబున నాగకన్యకలు శోభనములు బాడిరటయెట్టు వలెను.

శోభనము. శోభనము దేవకీ | సుతుడైన దేవునకు | శోభనము గుణనిధికి | శోకాపహారునకు | శోభనమే - ౧ - పరమపావనునకును | పంకాజనేత్రునకు | కర్వభయహరునకు | కరుణాకటాక్షునకు | శోభనమె - ౨ - నందకొమారునకూ | నవనీత చోరునకూ | కందర్పజనకునకు | కపిజనోద్ధారునకూ | శోభనమె | గోపాలబాలునకూ | గోపకులనాథునకూ | మాపాలివరదునకూ | మణినీలదేహునకు | శోభనమే.

వ || ఆ సమయంబున మంగళము పాడిరటయెట్టువలెను.

మంగళం బెదువంశ మార్తాండ తేజునకు మురవైరి సురవైరి మర్దనునకూ మంగళము వేడుకతో మము గన్న శ్రీకృష్ణునకు మంగళము నేలు మాధవునకూ జయమంగళం నిత్యశుభమంగళం || ౧ || కారుణ్యధామునకు కలి శాప నాశనకు | సురయక్ష సాధ్య ముని శోభితునకు | నిరుపమాకారునకు నీలవర్ణాంగునకు పరమాత్ముడైన గోపాలునకూ జయ || ౨ || అఖిలలోకేశునకు నవతార దేవునకు సనకసనందనాదివినుతునకూ - ప్రకటితంబుగ పలము భక్తపరిపాలునకు తగిపుగాను మము నేలు ధన్యునకూ - జయ || ౩ ||

వ || ఆ సమయంబున నా సుందరులు ధవళంబు పాడిరటయెట్టువలెను

ధవళము || జయజయ యదుకులబాల | జయజయ మదనగోపాల - ౧

# కాళింగమర్దనము.

జయజయబుధజనలోల।జయజయ పుణ్యసుశీల ॥ ౨ ॥జయజయమురళీవినోదజయజయ సురనుతపాద ॥ ౩ ॥ జయజయనిరుపమనాద । జయజయసర్వవినోద ॥ ౪ ॥ జయజయ గోకులరమణ।జయజయ పంకజచరణ ॥ ౫ ॥ జయజయలోకసంచరణ।జయజయ వెంకటరమణ ॥ ౬ ॥

వ ॥ తదనంతరంబునయ్యింతులందరొక్క మొగిం యాలలు పాడిరట యెట్టులనెను.

యాలలు ॥యాదవకులమునంబుట్టి । మేదిని దైత్యులంగొట్టి।పొదుకొని రేపల్లె న్వెలయవ । గోపాలకృష్ణా । యాడవేం ద్రుమెల్లం బొగడంగ ॥ ౧ ॥ గోపకులనుపరి పాలింపన్ । గోవులగాచిరక్షింప । నేపుమీరగనే ప్రదినములు । గోపాలకృష్ణా । దాపునగొండ వ్రేలెత్తవా ॥ ౨ ॥ దేవుడని తెలియలేక గావరించినకంసునిగొట్టి । దేవజగములన్నియేలవా । గోపాలకృష్ణ । దేవతులు మెచ్చి పొగడంగ ॥ ౩ ॥

వ ॥ అనవుడు గాళింగుండనేకవిధంబుల స్త్రీలతోడంగూడి శ్రీకృష్ణుని యుపచరించియేమనుచున్నాడు॥

అటతాళము.

దేవమాయపరాధములమది దీపుడనుచు ।నమ్ముడంబు। యాగనిగలు నుందానఫణిపతి హరికి మ్రొక్కెన్ ॥ ౧ ॥ మ్రొక్కి నిలచినఫణికిం గనుగొని మోదమలర వేడుక। మకురావతొగరుణించి వెడలెనుపొందిరంబు ॥ ౨ ॥ అపుడునగపము వేడలికృష్ణుండడవిలోకట।గొలువగనిపుణుడైతా వచ్చినిలచెను నేర్పుమీరన్ ॥ ౩ ॥ నిలచి వేడుకనంపెవారలనిజనివాసంబులకును । తెలివిమూర్చలునందరికి తాం దెలిపెనపుడు ॥ ౪ ॥ వరుసతోడుతనిద్రబోయినవారివలెనే। లేచిరి ।వరుసగాహరిజూచియుందరువగచిరపుడు ॥ ౫ ॥

వ ॥ అట్టియెడ శ్రీకృష్ణుండునందాములకు వందనంబాచరించెనంతయశోదాదేవి శ్రీకృష్ణునిందనహస్తంబుల నెత్తియక్కునంజేర్చి చెక్కిలిముద్దాడిశిరమాఘ్రాణించితనతొడలపైనిడుకొనికుమారునితో నేమనుచున్నది॥

జంపె.

నాతం డ్రిపాముననునయముతోసాధించి। యెత్తెరంగునమరల నిందువ

చ్చితివి ॥౧॥ గోపాలయీవేళమాపాఁగలిగితివి। యీపాలముసాధించియన్న చ్చితివి ॥౨॥ ఆబాలురనుకేఁచియాత్మలోమముఁడలఁచి। యీపాపము జికిరాయెంతయడలితివో ॥౩॥ ఇదివరకునీవుమరి యెన్నిగండములైనపవి ముగసాధించిపారివచ్చెదవు ॥౪॥ నీకెతగు నీనేర్పు నీకెతగునీయోరు గాకనితరులకెందుగలునేతనయ ॥౫॥ గోపికలుగొల్లలును గోవిందుని జేరి। బాపురేయనివగచిరాపాలతిఁజేరి ॥౬॥

ద్విపద.

అంతనాశ్రీకృష్ణు డానందమునకును * సంతసంబున మొక్కఁబాలఁదీ వించి * తనయునిగరములఁదానెత్తుకొనుచు * గనుగొనిహర్షమునఁగా రవింపుచును * కరము నెత్తితన కన్నులనొత్తి * పరగఁగానానంద భరి తుఁడైమించి * బొజ్జవాఁడనుకృష్ణుబువ్వదినుమనిన * నిర్జరనుతుఁడైన నీలవర్ణుండపు * బాలురతోఁగూడిబంతిగూర్చుండ * చాలయశోదయు సరగునసపుడు * చిక్కంబులన్నియుఁజక్కఁగావిడచి * గ్రక్కునవడ్డిం చెగలవంటకములు * ఊరగాయలతోడ నొప్పుమీరంగ * మాఱువడ్డించె నామదిరాక్షియపుడు * బుజగింపుచుసుతుని పొల్పుమీరంగ * బొజ్జనిండ గగుడిపె పురుషోత్తమునకు * భానుడప్పుడెగ్రుంకెపడమటిదెసను * మానుగమందల మరిచాలుకొనుచు * వేణునాదము సెలఁగ వేడ్కతోనపు డు * జాణుఁడైమునందసఖులతోనడిచె * సొద్దుపొవగజూచిపురము వా రెల్ల * వడివడినడకతోవచ్చిరాపురికి.

వ ॥ అయ్యవసరంబున రేపల్లెకువచ్చినకృష్ణునకు గోపకన్యకలుదృష్టి పరిహారముగాహారతులిచ్చిరటయెటువలెను.

మంగళము.

రామునకు లోకాభిరామునకు యదువంశసోమునకు బహుబలభీమున కును। శ్యామునకుభక్తపరిపాలునకు భద్రగిరిధామునకు కారుణ్యధాము నకును ॥ జయమంగళం నిత్యశుభమంగళం ॥ సారునకు దురితసంహారునకు రూపజితమారునకుగుణమణీహారునకును। ధీరునకు మేరుసమధీరునకు వేదాంతసారునకుసుగుణాలవాలునకును ॥జయ॥ బాలునకుకరుణాలవాలు

భాగవతమునకును। బాలునకుగోపికాలోలునకు గనుజేయకాలునకు వేణుగోపాలునకును।జయ। కృష్ణునకుసురవైరిజిష్ణునకు ద్విజసురోత్కృష్ణునకు క్షేమంకరిష్ణునకును।విష్ణునకు బాలార్క దీప్తునకుసద్యోగరిష్ణునకు భువనవర్ధిష్ణునకును * జయమంగళంనిత్యశుభమంగళం.

వ॥ అట్టియెడసూర్యాస్తమయం బాయెనటయంతటవారు వారుపురంబునకు పోయిరటయెట్టులనెను.

సీ॥అనవుడుశ్రీకృష్ణుఁడామంగవారెల్లనుచ్చికలరేపల్లెజొచ్చిరపుడు తమతమవీధులతమమందిరములకు బాలురుగోవులదోలివిడచి। ఆరాత్రియందరునతిసంభ్రమములతో వెలసియుండిరిప్రజల్ స్వేచ్ఛమీర ।మాధవుఁడావేళమజ్జనంబొనరించి భోజనంబులు చేసెసొంపుగాను। గాననీరీతిదినములుగడుపవలయు । మానవేశ్వర కృష్ణుండు మహిమమీర । కరుణనీరీతిబాలురఁగలసియాఁడు। వినుము రేపల్లెలోహరి వెలసియుండు.

అటతాళము ॥ ధరణిభారముతీర్చుకొఱకై దానవారి॥బాలుఁడై ॥ధరణిలోనీగతివెలసెనుధర్మమూర్తి॥ ౧ ॥ మర్త్యులనిరీక్షించితాను నిర్దోషముగను । నమ్మిన। సజ్జనులఁబాలింపుచుండెనుచాలవేడ్క ॥ ౨ ॥ అంతము గరేపల్లెవాడలోనంచరికిని । వేడుక । పొంపుగావర్తింపుచుండెనుభూపవరేణ్య ॥ ౩॥

ద్విపద.

అనిరుద్ధజనకుని వాసుని పేర * ఘనుడైనయదువంశగంభీరుపేర* దేవకీసుతువాసు దేవుని పేర * గోవులగాఁచినగోపాలు పేర * నగధరుపేర పన్నగతల్ప పేర * నిగమగోచరుపేర * నిఖిలార్థుపేర * అండజరాజపర్యంకుని పేర * గజరాజరక్షణగంభీరుపేర * నిలనుతిరువళికేణి నెలమివేడుకల* చరియించుహరిపార్థసారథిపేర * నంకితంబుగదత్పదాత్యంత నియతి * పంకజాక్షునిపాదపద్మసేవకుఁడు * సన్నుతిమీరంగసరసుడోయనఁగ *వన్నెగానరసింహావరశాసితుండ * ఘనువైష్ణవశ్రేష్ఠఘనదాసుడనఁగ*నానుతేజుండ వేంకటపతికవిని * చాలంగశ్రీపార్థసారథికరుణ *లలితమూలార్థ్యాగ్రమణమైమెప్పు * రమ్యమైనవరసాలంకారసరణి * కమనీయ్యమైనయీకాళింగుకథయు *యక్షగానంబుగాశిక్షతో జేసి *సరసవాక్యంబులఁజాల

వేడుకల * పరమాత్ముశ్రీకృష్ణు[illegible]ను * పరమభక్తినిసమర్థ
ముగావించి* వివరించితినికథ విఖ్యాతివెలయు * సత్కవిశ్రేణికిసంస్తుత్య
మగుచు* ధరణిలోనాచంద్రతారకంబగుచు *నుండుగావుతకృష్ణమండనం
బగుచు. *********************************

కాళింగమర్దనము.



యక్షగానముసంపూర్ణము.

